సంపుటము 2] ఏప్రిల్ 1916 [సంచిక 10

# బాలమిత్ర

## ప్రభు యేసు పునరుత్థాన కథ



తెల్లవారుచున్నది; పక్షులు మధుర స్వరములతో గట్టిగా గానముల సల్పుచు, నిద్రించువారల మేల్కొల్పుచున్నవి. పనివాండ్రు, వ్యవసాయకులు రెండు దిన

ముల క్రిందట జరిగిన వ్యసనకర వార్తను తలంచుకొనుచు, తమ తమ పనుల కేగుచున్నారు. సబ్బాతు దాటినందున పలుగురు ఉద్యోగస్థులు పనులకు పయనమై పోవుచుండిరి. కొందరు భక్తిగల స్త్రీలు మంచి మంచి వాసనలతో గూడిన ద్రవ్యముల హస్తములబూని చిమ్మ చీకటిలో ఎద్దియో పనిమీద ముందుకు సాగుచు, పోయి పోయి, ఒక ముద్ర వేయబడిన సమాధి కడ నిలిచి గుస గుస లాడసాగిరి. అంద రన్నన్ని విధముల మాటలాడ సాగిరి. ఒకతె "ఏమిటీ చిత్రము. సమాధి తెరవబడి యున్నది. రాతితో గట్టిగా ముద్ర వేయబడెనే, ఎవరు దీని దొల్లించి యుందురు? విరోధులు అసూయచే నిట్లు జేసిరా ఏమి!" అనుచుండ, మరియొకతె "ఏమి టమ్మా తెల్ల తెల్లగా గాన్పించునది? అరే! మానుష్య పోలిక లున్నట్లు కనబడుచున్నది. ఎంత ప్రకాశ మానముగ నున్నారు" అంతలో "భయపడకుడి, మీర లెవరికై వెదుక వచ్చిరో అత డిచట లేడు. ఇంతకు మున్నే లేచి, ఇదివరకు మీతో చెప్పి నట్లు వెళ్లియున్నాడ"ని ఎవరో చెప్పుట వినిరి. తుదకు వారు ఆ మాటలు దూతలచే చెప్పబడినట్లు, వారు సమాధిలో కూర్చుండి యున్నట్లు తెలిసికొని, అయ్యో మన మింత ప్రయాసపడి కటిక చీకటియనియైన వెనుక దీయక ప్రభుని దేహమున కీ సుగంధ ద్రవ్యముల పూయుదమని వచ్చిన,

లేడేయనుచు తర్లిపోయిరి. అయితే ఒక్క తె మాత్రము ఏదో గొప్పనగ పోయిన వెదకునట్లు, పిచ్చబట్టినట్లు వెదకుచు తోటలో దిరుగు చుండెను. అంతలో నొక రామెకు కన బడ, "అయ్యా! నజోరయుడైన యేసు సంగతి ఏమైనా తెలి యునా? నిన్నటి దినమున సబ్బాతు దినమగుట ఆయన సమాధికడకు పోలేక పోతిమి. నేడు తెల్లవారు జామున నే అచ్చటకు అతివేగముగ వెళ్లిచూడ నా ప్రభువు దేహ మెవరో చోరులు దొంగిలించినట్లు చూచితిని, అయ్యా మీకు అతనిగురించి ఏమైనా తెలియునా?" అనెను. అంత ఆయన "మరియా!" అని మిగుల మక్కువతో పలుకరింప, ఆమె, "రబ్బీయ"ని పిలిచి, తనయొద్ద నున్న దెవరని గ్రహించి, అతి సంతోషముచే ప్రభుని దగ్గరకు సమీపింపబోగా ఆయన తన్ను "ముట్టవద్ద"ని చెప్పి తానులేచిన వార్త పేతురు మొదలగు తన ప్రియస్నేహితుల కెరింగింపుమని యానతివ్వ ఆపె అట్లే చేసెను. ఇట్లు క్రీస్తుప్రభువు మరణమై మూడవనాడు మృత్యుంజయుడై లేచి, ఇమ్మాయు గ్రామమునకు వెళ్లు ఇరు వురు సోదరులకు, తన శిష్యులకు అనేక మారులు కనబడెను. మృతులైనవారలు తిరిగీ లేతురా? అను సందియము మనకు పుట్టకపోదు. గ్రుడ్డులో పిల్లయేర్పడి కొలది దినములకు పిల్లయై బయటకువచ్చి, ముచ్చటగా తిరుగుచు, గింజ లేరుకొనుట

మనము కాంచుటలేదా ? ఇది చిత్రముకాదా! అట్లే మన దేహములు చనిపోయినను ఆత్మలు జీవించియే యుండును. తుదకవి పునరుత్థాన దినమున లేచును. మన ప్రభువగు యేసు చనిపోయినవారినుండి లేచెను గనుక ఆయన అనుచరులమును, ఆయనయందు విశ్వాసముంచిన వారమగు మనమును ఆయనకుబోలి చనిపోయినను తిరిగీ లేతుమనుటకేమియు సందియములేదు. పునరుత్థాన మర్మము ప్రభునకే తెలియును. గాని సామాన్యులమగు మనబుద్ధికి ఏమియు తెలియదు. గాన నిరీక్షణలేని అన్యులకువలెగాక మనప్రభు నిర్ణయ దినమున, మృతులమగు మనమంతా లేచుదినము వచ్చునని నమ్ముదము.

## పునరుత్థాన గానము

మరణమునొందిన యేసుండు - లేచెను మూడవ దినమందు
హల్లెలూయాయని పాడుము - హొసన్నా రాజుపేర ।

1. ఎచటనె మరణమానీముల్లు - ఎక్కడనే నీవిజయంబు
   స్తోత్రము జేయుము యేసునకు - జయదాతగు నేసునిపేర ॥ మ

2. సోదరఎంచుము మనసార - సతతము మెస్సయ్యా ప్రేమన్
   త్రెంచెన్ మృత్యుపాశమును - దనరగనిచ్చెన్ జీవమును ॥ మ

3. వెరువకు మనసానీవికను - వీడుము పాపంబీక్షణమే
   కనుమీ క్రీస్తును క్రైస్తవుడా - కర్తునిగాంచిన మానినిమాడ్కిన్ ॥ మ

4. లేపాపపు నిద్రనుండి లభించును నీతి పునరుత్థానం
జీవించునూతన జీవనము - సజీవుండైన క్రీస్తునితో || మ

5. సాయము జేయును యేసుప్రభూ సత్యముగా వర్తించుటకు
నిష్ఠూ భాగ్యముచేరుటకు - నిత్యమహిమ రాజ్యమ్మున || మ

---

# మనస్సాక్షి

ఒకానొకప్పుడొక దొరసాని, తన సండేస్కూలు క్లాసునందు, "మంచి మానససాక్ష్యమా సింతమా" యను చరణమునుగూర్చి బోధింపవలసివచ్చెను. అప్పుడామె బోధించుచూ "మనస్సాక్షి" యనగా నేమో మీకు దెలియునా? యని బాలుర నందరిని వరుసగా బ్రశ్నింపగా, పిల్లలందరును ఏ జవాబును చెప్పక యూరకుండిరి. గాని యొక చిన్న పిల్లవాడు తనకు తెలిసినట్టుగా నటించుచూ, తలయూచుచూ, తన్నడిగినయెడల జెప్పుటకు సిద్ధముగా నున్నట్టాయమ్మ గ్రహించి, వానితో నీదిగువ సంభాషణజేసెను.

దొరసాని:—"అబ్బాయీ! మనస్సాక్షియనగా నేమో నీకు దెలియునా?"

పిల్లవాడు:—"ఓ! నాకు బాగాతెలుసు"

దొరసాని:—"అలాగైతే అదేమిటి?"

పిల్లవాడు:—“నాలోపల బ్రతుకుచున్న ఒక చిన్నవాడు.”

దొరసాని:—“ఓహో! అలాగైతే ఆ చిన్నవాడు నీతో ఎప్పుడైనను మాటలాడునా?”

పిల్లవాడు:—“అవును. మాట్లాడుతాడు.”

దొరసాని:—“సరే. ఆ చిన్నవాడు నీతో ఏమిచెప్పును?”

పిల్లవాడు:—(సిగ్గుతో అనుమానించి) “ఒకప్పుడు వద్దంటాడు” అని మెల్లగాజెప్పెను.

వీరిద్దరిట్లు సంభాషించుచుండగా, దాపుననున్న మరియొక చిన్నపిల్ల “అవును. నాలోకూడా నొక చిన్నపిల్ల బ్రతుకుచున్నది” నాతోను వద్దనునని చెప్పెను. వెంటనే పిల్లలందరును తమ మనస్సాక్షిని గ్రహించి, “నాలోనున్నాడు, నన్ను చెడ్డక్రియలు చేయవద్దంటాడని,” అందరును జెప్పిరి.

ఈ విధముగా నా చిన్నవానిద్వారా మనస్సాక్షియనగా నేమో వారందరు గ్రహించిరి.

దీనిజదువు పాఠకులారా! మీరు మీ మనస్సాక్షిని గ్రహించితిరా? మీ మనస్సాక్షికి లోబడుచున్నారా? మీ మనస్సాక్షి జెప్పు సద్బోధలనువిని అట్లు మీరు నడిచినయెడల దేవుడు మిమ్మును దీవించి, తన కృపారక్షణను మీ కనుగ్రహించును.



# నేర్పరియగు గ్రుడ్డివాడు



ఒక ఊరిలో ఒక గ్రుడ్డివా డుండెను. వాడు దిన దినము, ప్రతియింటికి వెళ్లి భిక్షమడిగిన సొమ్మును, 500 రూపాయిలు కూడబెట్టెను. దానిని తనయొద్ద నుంచుట క్షేమము కాదని యెంచి దానినొక పొలములో దాచ నిశ్చయించెను. గాన ఒకనాడు యెవరికిని తెలియకుండ వెళ్లి ఒక స్థలములో పూడ్చిపెట్టి వచ్చెను. అతడు దాని పాతిపెట్టుచుండగా పొరుగువాడు చూచెను. రెండు మూడు దినములకు వాడు వెళ్లి దానిని త్రవ్వి తెచ్చుకొనెను.

కొన్నిదినముల కాగ్రుడ్డివాడు వెళ్లి, తన ధనమచ్చట లేనట్లు కనుగొని ఎవరో దొంగిలించిరని మిగుల విచారపడెను. చాలాకాలమువరకు వాడు విచారించి చివరకు తన పొరుగువాడే దాని యపహరించినట్లు నిశ్చయించుకొని వానియొద్దకుబోయి, « మిత్రుడా! నాకేమియు తోచుటలేదు. నాయొద్ద వేయిరూపాయి లున్నవి. అందులో అయిదువందలొకచోట దాచితిని. మిగిలినవికూడా అక్కడే పెట్టేదా? లేక మరియొకచోట ఉంచేదా? ఇది నాయొద్ద ఉండుటవలన దొంగ లెత్తుకొని పోయెదరేమోనని భయమగుచున్నవి. ఏమి చేయుదున»ని సలహా అడిగెను. వాని ఆలోచన చాల బాగున్నదని వాడు ఆలాగే చేయుమనెను. గాని గ్రుడ్డివాడు ఆసొమ్ము అక్కడ లేకపోతే తక్కినవి దాచడనుకొని త్వరగా వెళ్లి తనయొద్ద నున్నవాటిని మళ్లి అక్కడ పెట్టివచ్చెను. కొంచెముసేపైన పిదప గ్రుడ్డివా డచ్చటకువెళ్లి, తన అయిదువందల రూపాయిలు త్రవ్వి తెచ్చుకొని, మిగుల సంతోషముతో తిరిగివచ్చుచు, తన పొరుగువానితో, « కండ్లున్నవానికంటె గ్రుడ్డివా డెక్కువ బాగుగా చూడగలడు » అని చెప్పెను.

# ఆయన నామమును వ్రాయుట

ఒక చిన్నపిల్ల ఒక ఊరిలోగలదు. ఆమెపేరు కమల. ఆమె తన బైబిలును చదువుచుండగా ఒకనాడు మోక్షమునుగూర్చి కొన్నివాక్యములు చదువుట తటస్థించెను.

"తాతా! మోక్షములో నుండువారికి ఆకలి దప్పిక కాదట. నా కది అర్థమయినది. గాని ఆయననామము వారి నొసళ్లమీద నుండునట. అంటే ఏమిటి? ఏసుప్రభువుపేర్లు వారి నొసళ్లపై నెవరు వ్రాతురు?" అని ఆమె అడిగెను.

"ఎవరా? ఎవరినొసటిపై వారే వ్రాసికొందురు."

"ఎవరికి వారేనా? ఏలాగు?"

"ఏలాగా, కమలా తెలియదా? మనము ప్రతిదినము మన యజమానులపేరులు మన నొసళ్లపై వ్రాయుచున్నాము. కొందరు పొరబడి పాపమును సేవింతురు. గాన పాపము తనముద్ర వారి నొసళ్లపై వేయును. కొందరు చింతను సేవింతురు. గాన అట్టివారి నొసళ్లపై చింత, ముడుతలను ముద్రవేయుచున్నవి. గాని మరికొందరు యేసును ప్రేమించి, ఆయనతో నడిచి, ఆయన చిత్తప్రకారము చేతురుగాన ఆయనముద్ర తమపై వ్రాసికొందురు."

# నక్క, మేకపిల్ల



అనగనగ ఒక మేక, ఆ మేక కొక కొడుకు. ఆ కొడుకంటే మేకకు చాల ప్రేమ. లేక లేక పుట్టెనుగాన బహుముద్దుగా పెంచుచుండెను. తల్లి ప్రేమజూచి, వీడు మహాగారాము చేసేవాడు. వానికి కొమ్ములు గడ్డము వచ్చుచున్నట్లు చూచుకొని, మహా మురుసుకొనేవాడు. ఒకనాడు మేక బజారుకు పోవలసి వచ్చింది. గనుక కొడుకునుబిలిచి, „ఓరే నాయినా! నే బజారుకు పోతున్నాను. నీవు యింటికాడ నేఉండి, ఇల్లు

చూచుకోవాలి. ఒకటిమాత్రము జాగ్రత! ముసలోడు టక్కులనక్కబావ వస్తాడు. తలు పెంతమాత్రము తీయ బోకు సుమీ!" అని చెప్పి బయిలుదేరింది. సరే లెమ్మన్నది మేకపిల్ల. మేక గడప దాటబోయి, గడపతగిలి కూలపడి, అయ్యో అవశకున మయింది! వెళ్లవద్దనుకొని, అయినా మా నెలే యని తెగించిపోయెను. మేకపిల్ల తలుపువేసి గొళ్లెము బెట్టింది.

కొంచెము సేపటికి నక్క చంక కొకమూట తగిలించు కొని, కోమటివలె వేషము వేసికొని కుంటుకుంటు వచ్చెను. చాల నొప్పెట్టుచున్నట్లు నటించుచు "అబ్బా! ఎవరన్నా యేమయినా కొంటే బాగుండు ఎవరైనా యేమయినా కొంటే బాగుండు" ననుచుండెను. మేకపిల్లా మాటలువిని, చాల జాలిపడి, తలుపుగుండాచూచి, "ఏంటయ్యా పాపము!" అనెను. ఆ నక్క, కంటికి కడివెడుగాయేడ్చి, తన కష్టమంత కడుపు కరుగునట్లు చెప్పెను ఒక అద్దముతీసి మేకపిల్లకు చూపించెను. ఆ మేక అద్దములో చూచుకొని "ఓహో, నేను చాల షోక్‌గా నున్నాను. బయటపోయి చూస్తే మరీ బాగుంటాను అనుకొనుచు, తల్లిమాట మరిచి, బయటకు వచ్చెను. ఆ నక్క సంచిలోనున్న వాటినన్నిటిని చూపించిందిగాని, ఒక చిన్నగంటను మాత్రము అట్లనే ఉంచెను.

అప్పుడు మేక, ఇదేంటయ్యా" యని దాని తీసికొన వంగు నంతలో నక్క దానినోట చిక్కించుకొని కన్నుమూసి తెరచునంతలో తన గుంటను తీసికొని పోయింది.

తల్లి మేక వచ్చిచూచి, పిల్లను గానక, పిలిచి పిలిచి, చిల్లర వస్తువులన్ని పడియుండుటజూచి, ఏమిజరిగినది తెలుసు కొని చాల యేడ్చెను.

తల్లిమాటవినక, అతిశయపడి అవిధేయురాలైన మేకపిల్ల గతియేమయిందో చూడండి!

---

# ప్రకృతి పాఠములు

## 21-వ పాఠము

## భూమాత

వృక్షములు మొదలగు మొక్కలకు కావలసిన ఆహారము భూమిలో నున్నదిగదా? ఆలాగే జంతువులకు కావలసినది యావత్తును భూమిలోనే యున్నది. అయితే, కొంతమట్టిని తీసికొని కడుపు నింపుకొనినయెడల మనము

జీవింతుమా? జీవింపముగదా? ఎందుకు? నేలలోనున్నది మన కడుపులకు తగిన ఆహారముకాదు. మన కడుపులకు తగినట్లది మార్చబడవలసి యున్నవి.

ఈ మార్పునే చెట్లు చేయుచున్నవి. మనకు కావలసిన భోజన పదార్థములను నేలనుండి పీల్చుకొని, వానిని మన కడుపులకు తగినట్లు చేయుచున్నవి. ఇదేలాగున జరుగుచున్నదో వివరించెదను.

మనము అన్నము తినుచున్నాముగదా? ఆ అన్నము జీర్ణమై రక్తముగామారి మనకు కావలసిన పోషణ ఇచ్చుచున్నవి. అన్నము యేమిటి? ఎక్కడనుండి వచ్చుచున్నది? వడ్లగింజలనుండి అని అందరకు తెలుసును. ఈ వడ్లగింజలు వరికాడలలోని గొట్టములగుండా వచ్చురసమువలన యేర్పడినది. ఈ రసము భూమిలోనుండి వచ్చినది. గనుక మనము తిని జీవించునదంతయు భూమిలోనుండి వచ్చుచున్నవి. మనము తినుదానిలో మరియొకటి చక్కెర. ఇది చెరకునుండి చేయబడును. చెరకు ఒక తరహామొక్క, భూమిలోనున్న సారమును తీసికొని తియ్యగా నగుచున్నది. గాని నీవుకొంచెము మట్టిని నోటిలో వేసికొన్నయెడల అది తియ్యగా నుండదు. అది తియ్యగా నుండులాగున మొక్కలు చేయవలసి యున్నవి.

మాంసముకూడా ఇదేలాగున నున్నది. మనము తిను మాంసము కొంతకాలము క్రిందట మన్నుగా నుండెను. ఏలాగు? అది మేకమాంస మనుకొనుము. ఆ మేక గడ్డిని తినునదిగదా? గడ్డి, వ్రేళ్లద్వారా తేబడిన భూసారమై యున్నదని ఇదివరకే మనకు తెలియును. ఈ గడ్డి తినుట వలన మేక కది రక్తమైనది. రక్తమువలన మేకలోని కండర ములు, ఎముకలు మొదలగునవన్నియు ఏర్పడినవి తరువాత మేక మాంసము మనుష్యులు తినుచున్నారు. గనుక మాంసము కొంతకాలము క్రిందట భూమినుండి తీయబడినదే.

ఈలాగున మనము కొంచెము పరిశీలించి చూచినయెడల మనము తినునది యావత్తును భూమినుండియే కలుగుచున్నది. తల్లి యేలాగు బిడ్డకు పాలద్వారాపోషణ కలిగించుచున్నదో, అదేలాగున భూమి మనకు కావలసినది యావత్తు సప్లయి చేయుచున్నది గనుక దానికి “భూమాత” అను పేరు తగినది కాదా?

“మట్టితో చేయబడితివి. నీవు మన్నైపోవుదువు” అను వాక్యము అర్థమేమిటో ఆలోచించుడి.



# బాలమిత్ర టపా




ప్రియమైన బాలమిత్రా !

తుమ్మలపల్లి బడిపిల్ల మద్దాఆలీను అనేక సలాములుచేసి వ్రాసుకునే విన్నపములు.

అమ్మా నేను మా స్కూలులో నాలుగవ తరగతి చదువుచున్నాను. నాకు 12 సంవత్సరముల వయసు ఉన్నది. దేవుడు నన్ను ఈ 12 సంవత్సరములు సురక్షితముగా కాపాడినందుకు ఆయనకు స్తోత్రములు సుమారు సంవ

త్సరము క్రిందట మాతండ్రి చనిపోయెను. నాకు ఒక అక్కమాత్రము కలదు, మాయమ్మ నేను మాఅక్కయ్యయు తుమ్మలపల్లిలో ఉన్నాము. మా స్కూలులో నాలుగు తరగతులు ఉన్నవి. మన స్నేహితుడైన బాలమిత్రుని మా మాస్టరుగారు తెప్పించి మాకు ఇస్తుఉన్నారు. చాలాకాలము నుంచి నేనుకూడ ఒక ఉత్తరము వ్రాయవలయునని కోరుచున్నాను ఇప్పుడు నాకోరిక ఈడేరినందుకు ఆయనకే వందనములు.

ఇట్లు తమ పేదబాలమిత్ర,
మద్దా ఆలీసు,
తుమ్మలపల్లి.

---

దేవా! నా నోటికి కావలియుంచుము.
నా పెదవుల ద్వారమునకు కాపుపెట్టుము.

C. L. S. PRESS, MADRAS—1916